దలఁపఁగ నేమియౌనొ యట ధారుణి యేవిధమౌనొ యింతకుం
జలమఱి భూవిభుండు కపి సన్మతిఁ బ్రోచిన నన్ని చక్కనౌ.

వ. అని యిట్లు వేలు వేలు గుంపులుగట్టి పలుకుచున్న వారికొంద
ఱిట్లనిరి. 83

క. చోరుఁ డనునాదు మీకవి
కారయఁగను నేఁటికిని యథార్థం బయ్యెన్
జారుఁడు మఱి రెండుం దగ
శూరులు మెచ్చుదురె జారచోరత్వంబుల్. 84

వ. మఱికొందఱిట్లు పల్కిరి. 85

క. ఏమిదోసంగే క్షత్రియ
కామిని గాంధర్వమున మగనిఁ గైకొనినన్
ఈమహిరాజర్షి సుతల్
భూమిసురలఁ బెండ్లియాడ దోషమియకదా. 86

వ. అనుటయు నక్కాంతాలలామం బక్కవివరునిం జూచి యి
ట్లనియె. 87

ఉ. హా కవిరాజచంద్ర మదనాంచితవిగ్రహ నన్ను నిష్ఠుర
శోకవియోగవారినిధిఁ ద్రోచి చనం దగ వౌనె నీకు న
య్యో కరుణాంబురాశి వని యుల్లమునం దగ నమ్మియుంటి నీ
వేకత మెట్టులేఁగెదు రహిం గవగూడిన మేలు నెల్లదే. 88

వ. అని విలపించుచున్న మార్గంబునం బోవుచుండి వినిబిల్హణుం
డు దోధూయమానమానసుండై తిరిగి చూచి యిట్లనియె.

బిల్హణుండు కామినింగూర్చి పలుకుట.

ఉ. హా కమలాయతాక్షి చెలి హా సరసీరుహకుట్మల స్తనీ
హా కమనీయగాత్రి సతి హా నవమోహిని హా వధూమణీ

హా కనకాంగి నేను విడనాడితి నంచుఁ దలంచె దీవు ని
లోకమునందు జీవునకు లోలత గాక స్వతంత్రమున్న దే. 90
ఉ. ఓరమణీమణీ వికసితోత్పలపత్రవిశాలనేత్ర న
న్నారక యేల చూచెదవు ద్వారనివాసిని గోల దేవతా
వారవధూటికానయనవాగురికావలయంబునందు దు
ర్వారతఁ జిక్కి తాపుగిడివచ్చునె బిల్హణుఁ డెన్నిభంగులన్.
వ. అని పలుకుభూసురవరునిఁ దలవరు లురుగతిఁ బదమనిక్షశా
నవాటికిఁ దోడుకొని పోయి యొకవటవృక్షంబుక్రింద నిల్పి
నబిల్హణుఁడు నలుదెసలం జూచి తల్లడిల్లనియుల్లంబుతో మం
దస్మితవదనారవిందుం డై వీరసేనున కి ట్లనియె. 92
క. ఓతలవరి తడ వేటికి
నాతతనిశితాసిఁ గొని ధరాధీశునియా
జ్ఞాతంత్రమునను బిల్హణు
వే తెగ వ్రేయుము శిరంబు విశ్వము మెచ్చన్. 93
వ. అనిన విని వీరసేనుం డి ట్లనియె. 94
క. కవిరాజవర్య నీ విపు
డవిరళగతి నించుకైన నాత్మ భయంబుం
దవులక దరస్మితాస్యుఁడ
వవుటకుఁ గత వెద్ది సెప్పు మమలవిచారా. 95
వ. అనిన బిల్హణుం డి ట్లనియె. 96
చ. హితమతిఁ జెప్పెద న్వినుము హీనగుణాకర వీరసేన యీ
క్షితిరమణాత్మజాత సరసీరుహలోచన మంత్రదేవతా
కృతియయి వేడ్కనాహృదయగేహమునందువసించిజోడుగా
సతతముఁ బాయకున్నది విచారము లేటికి దైన్య మేటికిన్.

వ. అని మఱియు ని ట్లనియె. 98

చ. కలికివధూమణిన్ స్మరవికస్వరచారురుచిన్ గుణాకరన్
జలరుహలోచనన్ జలదచంచలవేణి సుధాకరాననన్
సలలితతుంగపీనకఠిన స్తనమధ్యగహారభాసురం
బిలసుమనాసికన్ మదిని దేవతఁగా స్మరియింతు నెంతయున్.

తలవరి కవిని ఖండింపక యుంచుట.

వ. అని తదేకాయత్తచిత్తుం డై నకవివరునిం జూచి ఖండింపఁ
జేతులు రాక హ్యాతబహుజనప్రాణం బగుకృపాణంబు నేలం
బడవైచి వీరసేనుండు కృపాధీనుం డై నిలువంబడియున్న తద
నంతరంబ యవ్విప్రుండు రాజపుత్త్రిని హృదయంబున నుప
లక్షించి యి ట్లనియె. 100

కవి కామిని హృదయంబునఁ బలుతెఱంగుల స్మరించుట.

చ. పరమసువర్ణచంపకనిభాసురగౌరి సురోమరాజి ని
ద్దురఁగాని మేలుకొన్న సతిఁ దోయరుహాంబకవిహ్వలాంగిఁ దా
మరసదళాయతేక్షణఁ బ్రమాదపథంబునఁ బోవు విద్య నై
ఖరి మదిలోన నెప్పటికిఁ గాంక్ష దలిర్పఁగఁ జింతఁ జేసెదన్.

మ. విలసత్పంకజమధ్య గౌరరుచి దైవం బొంది గోరోచనా
తిలకోదంచితపాటలద్యుతిసద్దివ్యల్లలాటంబు నై
లలినొక్కింతమదంబుచే నలసలీలాఘూర్ణదృక్పాత మై
చెలువౌ నాసతిమోమునన్ నిలుచు నాచిత్తంబుయుక్తంబుగాన్.

చ. శ్రమజలసాంద్రబిందుతతి సారపుమౌక్తికరాజివైఖరిం
గొమరు సెలంగ హేమమణికుండలదీప్తుల గండభాగముల్
రమణ రహింపఁగా నుపరిరత్యనుభూతిని యోగ మంది చె
ల్వమరుతదాస్య మిప్పటికి నాత్మ భజించెద నిశ్చలుండ నై.

ఉ. పున్నమనాఁటిచందురునిఁ బోలుమొగంబును మొల్కచన్ను
లున్, సన్నపుటారు లేవయసుచాయలు దేఱినమేనుసొంపు నా
కన్నియరూపు నేమఁగుడఁ గాంచితి నేని మనోజసాయకా
గ్నిన్నెఱకాఁకదోఁకొనిన నెమ్మెయి నెమ్మదిఁ జల్లఁజేయుదున్.

ఉ. ఏవిధిఁ గాంతు నారమణి నే నొకరాతిరి తుమ్మినన్ 'చిరం
జీవ' యటంచుఁ దచ్ఛ్రవణశేషవశోవిభవంబు మాని రో
షావహచిత్తయై పలుక కందపుఁగమ్మ ఘటించెఁ గర్ణమం
దావిధి నామది న్నెదలి యాడుచునున్నది గాఘుసంబుగాన్.

ఉ. ఉన్నతచారుపీవరపయోధరభారము చేత ఖిన్నయై
చెన్ను గనూత్నయౌవనము చేఁ దనరారుసుధాకరాననన్
గ్రన్ననఁ గౌఁగిలించి వదనంబు ముదంబున ముద్దువెట్టుదున్
వన్నియమీఱ మత్తమధుపంబు సరోరుహమాస్యకైవడిన్.

ఉ. మానిని విస్ఫురత్కమలమంజులపత్త్రవిశాలలోచనం
బీనకఠోరతుంగకుచభృంగగరుద్రుచినీలవక్రస
న్నానితకోమలాలకసమానవరాకృతిఁ గామదేవతన్
దాని గురూపదేశమువిధంబున ధ్యానము సేతు నాత్మలోన్.

మ. నెరివాల్ చూపులు మొల్లక్రొవ్విరులకాంతిం జెందుపల్లాష సుం
దరయై తేనెలు జిల్కు మోవి గలయాతన్వంగివక్త్రాబ్జ మీ
ధరణిన్ సాధుపరోపకారము మఱిన్ దల్చుం గృతజ్ఞుంబలె
న్నరయ న్నామదిమర్వ నిప్పటికి నత్యంతానుభావ్యుండనై.

ఉ. దీటు సెలంగఁ బంచశరదివ్యధనుర్గతమత్తభృంగరా
టోత్కరగరుత్ప్రభారుచిరకోమలకస్తురికాలకంబులన్
నీటగుదంతపత్త్రముల నీలసరోరుహభూషణంబులన్
లూటిగ దాని మోము మదిలోఁ దలపోయుదు మాటిమాటికిన్.

శా. తెల్లంబై చిఱునవ్వు వెన్నెలలచేఁ దెల్పొప్పులేఁ జెక్కులున్
మొల్లంబై తగుచంచరీకములగోముం జెందుకన్దమ్ములం
బ్రోల్లీలాంకశరత్సుధాంశురుచినొప్పున్ భామనెమ్మోమునా
యుల్లంబుం జివురింప నిప్పటికి నే నుప్పొంగి వీక్షించెదన్.

చ. దరముహాసించుకంధర ముదారత వంచి కరాంబుజాతముల్
వరకటిసంఘటించి జడ వామభుజంబున గబ్బిగుబ్బచ
న్నొరయ వహించి నిల్వఁబడి యూరక నన్ను ననేకరీతులన్
వరమతిఁ జూచు నత్తరుణి వర్ణన సేసెద నే ముదంబునన్.

ఉ. నే నపరాధినై యడరి నేర్పునఁ దత్పదపంకజంబులం
బూనికతోడుతం బడినఁ బోవఁగఁ ద్రోచి చరించుచున్న న
ద్దానిచెఱంగు పట్టిన సుదాత్తత నిగ్గక కోప మయ్యెడన్
మానక యున్నదాని వరమానిని నాత్మఁదలంతు నెంతయున్.

చ. సరిగొని నేల నేలుసువిశాలనితంబము లొప్పుదాని మే
ల్సరసులలోఁతుఁగాంచి బలుసమ్మతముం గనునాభిదాని మ
న్థరగతి గల్గుదానిని మృణాళసమానవిలాసబాహువుల్
బరఁగినదాని నెన్నెదను భావమునం దనుమధ్య నెప్పుడున్.

ఉ. అప్రతిమానబోధసురతాంతమునందు నిమీలితాక్షియై
కప్రపుఁదావి మాటికిని గ్రమ్మఁగ నూర్పులవేఁడి వాడి గం
డప్రరుచిన్ శ్రమాంబువులు దార్కొని గాలఁగనొప్పుదాని నే
నాప్రియురాలిమోము సుమనఃస్థితి నిప్పటికిం దలంచెదన్.

ఉ. నాయెడ నొక్కమాటయు మనంబున భావనచేసి మాటికిన్
డాయకనంతరంగమున దానరికట్టుకకోపభావయై [గాఁ
యాయతబాష్పకంఠయయియప్పటియూర్పులమోవిగ్రాఁగఁ
జేయఁదొడంగెరోదనము చింతనసేయుదు దానినెంతయున్.

శా. ఏకాంతంబున నొక్కనాఁడు గృహమం దెవ్వారు లేకుండఁగా
నాకంజేక్షణ దర్పణంబుఁ గొని పీఠాసక్తి నుండంగ నే
జోక న్వెన్క వసింప మత్ప్రతిమయుం జూపట్టవే సిగ్గుతో
నాకంపించి భ్రమించి మించె మదనోద్యన్మానసాంభోజయై.

చ. మఱియు సుగంధయుక్తమయి మంజులమై తగు మోముఁ ద
మ్మిపైఁ, దిరిగెడు గంధలుబ్ధమగు తేఁటిగమిం గనుదోయి
మాటికిం, దెఱచుచు మూయుచు న్మొగము ద్రిప్పుచుఁ గేలిస
రోరుహంబుచేఁ, దలుకుచు నొప్పునప్పొలఁతి ధ్యానము
సేసెద నిట్టివేళలన్. 117

మ. ఒకనాఁడొక్కెడ శ్రోణిపై వలువజాఱుండంగ నే నంతలో
నకలంకస్థితిఁ బోవ సిగ్గుపడి యాహా యంచు దా విహ్వలాం
గకయై భిత్తిని నొక్కచేత మదనాగారంబు వే మూసి వే
రొకచేఁ బొక్కిలిగప్పునప్పడఁతి నేనూహించి ప్రార్థించెదన్.

చ. అటు నిటు ముందు వెన్క బహిరంతరసీమల నన్నిదిక్కులన్
స్ఫుటతరకాంచనాంబురుహశోభితమంజులసుందరాస్యయై
తటుకున వాలుఁజూపులను దా ననుఁ జూచుచు సంచరించున
చ్చటులవిలోచన న్మదిని సన్నుతి సేసెద నేఁ బ్రియంబునన్.

శా. ఆకర్ణాంతములై మదాలసములై యబ్జోపమానంబులై
శ్రీకల్యాణములై రమావరసుతోద్రేకంబులై యిందవా
స్తోకాంశుప్రతులై సుధాప్రతతవిభాశోభాయమానంబులై
యాకంజాక్షివిలాసనేత్రములు నా స్వాంతంబునందొప్పెడున్.

చ. సమయ మెఱింగి నేఁ దలుపు చాటుననుండఁగఁ గేలుఁదమ్మి
మో, హమున మొగంబునం దిడి మదాగమనంబుఁ దలంచి
చూచుచుం, గ్రమమున మత్కులాంకపదకాండములన్ మ్రు

దుగీతిఁ బాడుచున్, రమణి మనోవికాస యయి రాజిలు
దాని మదిన్ భజించెదన్. 121

చ. కలువలఁ గేరుకన్నులను గాటుక రేకలు దీర్చి చెక్కులం
దలరఁగ జందనంబలఁది యాసయిఁ గస్తురికొంతపూసి మేల్
తిలకము దిద్ది ముత్యములదీటగుపాపటబొట్టమర్చియు
న్నలికులవేణిముద్దుమొగమ్మునిఁగాంచ దలపోయుచెంతయున్.

మ. కొనగోళ్లన్ బిగిగుబ్బలొత్తికురులుం గాఢంగఁ జేపట్టియున్
మొనపంటం జిగురాకుమోవిగొన మోమున్వ్రాల రోమాంత్రయై
కనుఁదమ్ముల్ మొగిడించి యుస్సురని సీత్కారంబుఁ గావిం
చుచున్, ననుఁ గోపించువధూటిమోము మది సన్నానంబు
గావించెదన్. 123

చ. స్మరజనకంబులై యమృతసారములై శ్రుతిరంజనంబులై
యరయ మృదూత్తరంబులయి యందములై మనికింప్రియం
బులై, కెరలుచు నోష్ఠపృష్ఠపరికీర్ణశుచిస్మితసంయుతంబులై
పరగు నెలంతవాక్యములు పట్టుగ శోభిలు నామనంబునన్.

చ. తనరఁగ నామువిం దరళతారనిమీలితలోచనంబులై
యనుపమలిప్తచందనరసాహితపాండురగండభాగమై
ఘనమృగనాభికాకుటిలకల్పితపత్త్రలతాభిరామమై
యనువగుసుందరీమణిముఖాబ్జమునిల్పెద వేడ్కమీఱఁగన్.

చ మఱియును గర్ణపాళిని సముంచితకాంచనకుండలంబులున్
మెఱయఁగ గబ్బిగుబ్బ చనుమిట్టల ముత్యపుఁబేర్లు రంజిలం
బిఱుఁదులఁగాంచి యొప్పమురిపెంబున నంచెలు మ్రోయవ
చ్చునా, మెఱుఁగుమిటారి నెన్నెదఁ జుమీ మది నిప్పటికిన్
హితంబుగాన్. 126

ఉ. సందిటిదోయి నామెడను జక్కఁగనిల్పుచు నిక్కి మిన్నలై
యందము లై చెలంగుతనయబ్బురపుబ్బుమెఱుంగుగుబ్బలం
బొందుగ నాయురంబునను బూన్చి మొగంబున మోముఁజే
ర్చి నన్నుం దగఁ జూచు నెచ్చెలి మనోహరమూర్తిఁ దలంచి
చూచెదన్. 127

చ. కురులు భుజాగ్రభాగమునఁ గూడి నటింప గళంబు లీలమై
నొరగఁగఁ బెట్టి రైకబిగి నొయ్యనఁ గాంతులు జీరువాఱఁగా
మెఱుఁగుమిటారిగుబ్బ లెలమిం గనుపట్టఁగ నన్నుఁ జూచున
గ్గరితయరాళపృష్ఠ మెనఁ గాంక్ష దలిర్పఁగఁ దేజరిల్లెడున్.

చ. అలరఁగఁ గోమలాంగుళికాంగుళియుల్ గలపై ఘటింపుచో
వలయముగా భుజాలతలు వాంచి పృథాంగవివర్తనంబులన్
వెలయుచు నుండఁగా సపరివేషసుధాకరకాంతి నొప్పున
ప్పొలఁతుకమోమునామదినిబూనిభజించెదవేడ్క మీఱఁగన్.

ఉ. తా నొకనాఁటి వేకువను తల్పమునన్ శయనించియుండఁగా
నే నట లేచి లేవఁగను నిద్రమయిన్ వెస నాకులత్వముం
బూని యరీతి నాతెనకుఁ బొల్పుగ మోవిడి కౌఁగిలించున
ష్టానిని నాత్మనిష్ఫలికి మార్వక నే భజియింతు నెంతయున్.

మ. చనుదోయిన్ మొగమందు లేఁజెమటలున్ జాఱంగుఱుల్చె
క్కులం, బనరం దూలఁగ హారముల్ చెపరి యాడం బైరతు
ల్సేయుచోఁ, జనువొప్పన్ననుఁ గాంచి లేనగవుతో శ్వాసో
క్తుల నాటికిన్, గొనబైనల్కువధూటి నామదినిఁ గోర్కుల్మీ
ఱ భావించెదన్. 131

మ. అలరుంబానుపు డాసివచ్చుటను నే నాలస్యముం జేయఁగా
వలపెచ్చం దలపోసి కామవికృతిన్ ద్వారంబున న్నిల్చి సం

చలనం బందుచు నెచ్చెలిం గదిసి కాంతుఁ డ్రీఁ డెత్తి కో
కిలవాగ్వైఖరి రోదనంబు గనునా కేళీసతిం గాంచెదన్. 132

ఉ. ద్వారమున న్వసించి కడుదైన్యమున న్ననుఁజూచిచూచి త
ద్ద్వారతలంబునం బడి శుగార్తిని డస్సియు నించుకంత ని
ద్రారతిఁజెంది లేచి మఱి తల్లడిలంగ లసత్కపోల యై
యారయుచున్న నెచ్చెలిని నాత్మ భజించెద మాటిమాటికిన్.

మ. బలుయూర్పుల్ నిగుడంగ నేత్రయుగళీనాంబువుల్ రాలసం
చలతంజూచుచు నావిధంబడుగ చుద్ఘ స్వాంతంబునానావిధం
బులఁబోఁగామదనుండుపై కొనఁగ మోహముల్ వాంచిచింతించు
న,బ్బలభిన్నీలశిలాకచన్ మదిని నేఁభావింతు నెల్లప్పుడున్. 134

ఉ. వేసవ నొక్కనాఁడు నిజవేశ్మమున న్నెఱిగొప్పు వీడఁగాఁ
గోకిలవాణి యున్మిషితఘూర్ణితదీర్ఘవిలోచనాబ్జ యై
తేకువ నిద్ర లేచి రుచి చేఱఁగ నొక్కినమోవి కేలిచే
నాకర గప్పఁగా నది మహాత్మను నిప్పటికిం దలంచెదన్. 135

చ. మఱియొకనాఁటిప్రొద్దున సుమానకఁ బంచటఁబుంగుడై నిదా
నిరవుగ నెచ్చెలింగదిసి యొంత ప్రియోక్తులు వల్కుచుండ నేఁ
బసువునవచ్చి వెన్కనిలువం బడినంతనె చూచి సిగ్గుతోఁ
జిఱునగవొప్పఁబోవుచెలిఁ జిత్తమునం దలపోసిచూచెదన్.

మ. అపరాధం బొనరించితీ వనుచు న న్నత్యంతకోపంబుతో
నుపలాలింపక నెమ్మొగంబియక యోహో చాలుఁజాలంచుబో
నపుడున్నేను బ్రియోక్తి నామికొన నత్యాసక్తిలేనట్టిమా
టపచారించిన నవ్వధూటిఁ గవుఁగింటం జేర్చి లాలించెదన్.

చ. పడుకొని యంతలోనఁ బరిభావితయై వడి లేచి నిద్రచేఁ
దొడిఁబడనావులించి మెయి దొట్రువిదిర్చి విజృంభణక్రియం

బోడమిన మోముదాసనకుఁ బూని భ్రమించుచు నున్న తేం
ట్లసం, దడికిఁ జలించునట్టి కనుఁదమ్ములుగల్గినదాని నెన్నెదన్.

చ. మనసిజభూజ సేయ నిజమానిను లంటఁ గూడి కేళికా
వనమునకేఁగుచోఁ దనదుపార్శ్వమునన్ వసియించునన్నుఁ జూ
చెనసినశంకతోడ జనులేమనుకొందురో యంచు భీత యై
క్షణముటులుండుమంచుఁ గనుసన్నలు సేయువధూటి నెన్నెదన్.

చ. సరసిజనేత్ర దాఁ బ్రథమసంగమవేళను సిగ్గు దోఁప నే
నరయుచు ధైర్యవృత్తిఁ గదియంగఁ దలంచినఁ జూచి భూతకృత్తు
ల్నె అపఁగ నందు దీపశిఖ లీనతఁ గంపము నొందు కర్ణభూ
సురకుముదంబుఁ గప్పుసతిఁ జూచెదనిప్పటికిన్ ముదంబునన్.

చ. చెలి తమితోడ నెచ్చెలుల నీ యని కోపము నేసి శీఘ్రతం
దలతల మంచుఁ బోఁగదిఁ దత్పరతం బులకల్ జనింపఁగా
నలరుచు సంస్మితాస్యయయియంతటనా చెసవచ్చి హాటమిం
గలసినభామినీమణిని గాంచెద గన్నులకర్వ్వదీఱఁగన్. 141

మ. కలకంఠోపమకంఠి నాస్యజితరాకాచంద్రబింబ న్మయూ
రలసద్బర్హసమానవేణి సుగుణవ్రాతాత్త నేత్రప్రభా
విలసన్మత్తచకోరయానవిజితశ్వేతచ్ఛదం గాంచనో
జ్జ్వలకుంభస్తనిఁ గామినీమణిని నే భావింతు నెల్లప్పుడున్.

మ. విరిశయ్యం బవళించి మన్మథమదావిర్భూతి కంగంబులన్
సరిఁగావింపుచుఁ గౌఁగిలించిముద మెచ్చన్నాదు కెమ్మోవిసుం
దరవక్త్రంబున నిల్పి పై సురతసంధానంబు గల్పించుశం
బరవిద్వీడ్ధ్వజవైజయంతి మదిసంభావించి ప్రార్థించెదన్. 143

ఉ. సిబ్బెపుగబ్బిచన్నుఁగవ చెన్నుగ నిక్కఁగ నక్కళించి యం
దబ్బురపాటు గన్పడఁగ నంగవిభంగవిశేషంబునన్ రుచుల్
గుబ్బతిలంగ బాహులతలుం బయికెత్తి గభీరనాభి పె
ల్లుబ్బినవేడ్కఁ జూపుచెలి నుల్లమునం దనపోసి చూచెదన్.

చ. పరువ వివర్తితంబు లయి ప్రాలునపాంగవిలోకనంబులన్
సురుచిరనోపమానమృదుమంథరమంజులభాషణంబులన్
పరమమధురస్మితంబులను దాలిమి యానకములన్ విలాసతన్
సిరు లెసఁగంగ నొప్పుచెలిచేష్టలు నాఁపడి సంస్మరించెదన్.

చ. కనుఁగవ యుంచుకంత నెటిగా నొసరించి సరత్నపాణికం
కణములఝుంకృతిధ్వనులగౌరవ మొప్పఁగఁ జన్నుదోయి ని
క్కనుగ మబ్బొమ్మలెత్తి నిజకైశ్యముచక్కఁగ మెచ్చొనర్చుమా
నినిఁ బలుమాఱు నిప్పటికి నేమదిలోఁ భజియింతు నెంతయున్.

చ. అరయ సహింపరాని విరహార్తిని గొందిన వైరయంబునన్
సురతవిశేషసంగతులఁ జొక్కపుతాండవసూత్రధారి యై
తరమిడి యంగమంగమును దాఁకఁగ గౌఁగిటఁబట్టికన్నుదో
యరయిడి చెక్కు నొక్కు సతినాత్మ భజించెదఁ గోర్కి మీఱఁగన్.

చ. విలసితమన్మథన్ విరహవిహ్వల లాలసగాత్రి సుందరిన్
లలితకురంగనేత్ర సువిలాసరసాంచితచారుకాంచనో
జ్జ్వలమహనీయచేలయుత శ్యామ విరాజితహంసయాన నే
నలవడ సంస్మరించెద ననారతమున్ మదిలోన వేడుకన్.

చ. మలయగిరిప్రభూతపవమానములం గని తీవ లాడఁగా
సలలితరత్నవేదిపయిఁ జక్కఁగఁ దా వసియించి గీతముల్
దలకొని వీణ సుస్వరయుతంబుగఁ బాడుచు నాళిపాళికిన్
లలి శ్రవణోత్సవం బొసఁగులక్షణగాత్రిని నే భజించెదన్.

## వీరసేనుండు కవిరచించుపద్యంబుల రాజునకుఁ బంపుట.

వ. అని యిట్లు కవివరుండు మదనోన్మాదంబున యామినీపూర్ణ
తిలకాయత్తచిత్తుండై తద్వర్ణనాతివిశేషంబులుగా రచించిన
పద్యంబులు లిఖింపఁజేసిన వీరసేనునియనుమతంబునఁ ద
ద్భృత్యులు భూపాలుని కప్పటప్పటి కర్పించినం జూచిచూ
చి యంతకంతకుఁ గోపాటోపంబునఁ గసరివేయుచున్న వారు
ను విసికిసికి నవలివచ్చి తద్వృత్తాంతం బంతయుఁ గవి
వరుండున్న వీరసేనున కిట్లనిరి. 150

చ. హిమరుచి సత్కళావిభవుఁ డీకవి రాజు రచించు నట్టిప
ద్యములు గ్రహించి భూవిభున కర్పణసేసినఁ జూచి కోపభా
వమున దురుక్తులం బలికి వారక పొమ్మను గాని మంచిమా
టమరఁగఁ బల్కఁ డాతఁడు తదాగ్రహవృత్తిఁ దలంపశక్యమే.

మ. అనవుడు వీరసేనుఁడు సచాననసుం గని యోగీంద్రయో
యనఘుఁడయిందిరావరసుతాభుఁడవౌనిసుసత్కృపామతిన్
మనమునఁబింపసేయు మది మానితిఁ బూనితి నేఁ దలంపఁగాఁ
బనివడెవ్వాయునక్కవులు పార్థివుఁడొప్ప నిదేను సేయుదున్.

ఉ. అనవుడుభూసురుండుహృదయాబ్జమునంగడునక్కయోగిని
న్ననయము మెచ్చితిన్ వినుధరాధిపుమానసముం గరంగునే
పనివడి యేల పంపితివి పాల్పడి నాకయి బ్రహ్మదేవుఁ డి
ట్లనులిఖియించియుండ వెతలంబడఁగారణమేలచూడఁగన్.

ఉ. ఓరి తలారి వీరి మఱి యూరక త్రిప్పకు మేలు త్రిప్పఁగా
సారముఖడ్గముంగొని విచారముసేయక త్రుంపుమన్నఁ ద
ద్ధీరత గాంచి వాఁడు క్షితిదేవకులోత్తమ యేతదర్థమై
యూరయఁ జాల నెంతపనికైన ఘరింపుదు నిన్ను లెస్సఁగన్

క. ఏవేమి వ్రాసితివో యా
భూమీపతిమానసంబు పొరలక పోయెన్
సామీ యీమాత్రైనను
సామోదత మంచిపద్య మానతి యిమ్మా. 155

వ. అనిన విని సృష్టికర్త యైనస్రష్ట నుద్దేశించి. 156

సీ. తనపృథ్వి యాఘునాఘనవేణి చరియించు
క్షితిభాగమున నుండఁ జేయుమయ్య
తనరసం బాసుధాధరక్రీడ లాడెడు
శృంగారసరసిలోఁ జేర్పుమయ్య
తనతేజ మాతక్తకనకాంగి పర్వించు
దర్పణాంతరమునఁ దార్పుమయ్య
తనవాయు వాసుగంధశ్వాస విసరించు
కొనువ్యజనంబునఁ గూర్పుమయ్య
తే. తననభం బారమణియింటి నునుపుమయ్య
యీశరీరంబు పంచత్వ మెనసినపుడు
స్వాంశములతోడ భూతంబు లైదునైదు
గూర్పుమయ్య విధాత నాకోర్కి దీఱ. 157

వ. అని యిట్లు కమలభవుని వేఁడి త్రికరణపూర్వకంబుగ నమ
స్కరించి నిలువంబడియున్న వీరసేనుఁడు తత్పద్యంబు గ్రహిం
చుకొని రాజసమీపంబునకు వచ్చి తత్పత్రిక సమర్పించిన.

క. ఇదియేమి మాటిమాటికి
హృదయంబున లేదె భీతి యొంతయు నన వాఁ
డదురక సామీ భూవర
యిది చూడుఁడు యొక్కవింత యేమో తలఁపన్. 159

వ. అనిన లిఖితంబు గైకొని పద్యంబుఁ జదువుకొని యయ్యర్థం
బనేకార్థంబులుగాఁ దోఁచినఁ గొంతతడ వాలోచించి యి
ట్లనియె. 160

క. ఓరి దురాత్మక విని పలు
మాఱిటు రావలదు హెచ్చి మఱి వచ్చితివా
నేరము గొందు గ్రహించుక
యూరక యాపని ఘటింపు మొప్పదు మాకున్. 161

ఆ. అన నిరాశుఁ డగుచు నావీరసేనుండు
వచ్చి పలికె విప్రవరునితోడ
నేను వ్రాసినావాఁ డెఱుఁగ నే నింతైన
మనసు గరఁగదయ్యె మనుజపతికి. 162

మ. అనిపల్కం దలయూఁచియూఁచి మదినాహా యంచు వేసా
హసం,బునఁ జాతుర్య మెలర్పఁగాఁ జనగతిన్ భూమీశు
సుచ్ఛాత్రియముం, గని రెండొక్కటిర్యైన మంచిది యగుం
గాకంచునిశ్శంకుఁడై, చన నూహించె శరప్రయోగమయి
యేఁచం బద్యముపద్ధతిన్. 163

కవిరాజు శోకశాంతికరం బైనయొకపద్యము వ్రాసిపంపుట.

చ. రవిజుఁడు భాగుణింప విధురంబుగ భట్టి నశించె భారవి
ప్రవరుఁడడంగె దీర్ఘముసఁబ్రాణముఁబాసె గుడియ్య భిక్షుఁడీ
యవనికిఁ దప్పె భీముఁడు దదంతగతి న్మఱి కొమ్మువెట్ట ని
క్షువముగ నేభకుండుఁడను గొమ్మున దీర్ఘము వెట్టకుండఁడీ
భువి నతఁ డెన్న నిర్దయుఁడు భూపతి పీవ్రుఁదలంప భూవరా.

వ. అని యీపద్యంబు లిఖియించి వీరసేనున కిట్లనియె. 165

క. ఓపుణ్యాత్మక వినుమా
యీపద్యముఁ జే గ్రహించి యెంతయుఁ జని నీ
వేపున నొసఁగినఁ వే యా
భూపతి ననుఁ బిల్వనంపుఁ బొమ్ము రయమునన్. 166

వ. అనిచెప్పిన నప్పద్యంబు గ్రహించుకొని పోయి రాజుముందఱం
బెట్టిన నప్పత్త్రిక దండధరాసిపుత్త్రికవిధంబున మదికిం
దోఁపం జూచి తదర్థంబు గ్రహించి మహీవల్లభుండు తపనో
త్కంపితకాళికామహీరుహాంబుచందంబునఁ గంపితసర్వావ
యవుండై యెంతయుం బ్రొద్దు చింతించి తదుభయస్పృహే
తర స్నేహసాహసంబులును తత్కవిత్వామహత్వంబును విచా
రించి వానితో ని ట్లనియె. 167

౼ రాజు కవిరాజుం బిలువఁబంపి పుత్త్రి నూఱడించుట. ౼

క. ఓవీరసేన యుచటికి
వేవేగము తోడితెమ్ము బిల్హణు ననినన్
భావము రంజిల వాఁడు ధ
రావిభునకు మ్రొక్కి వచ్చి రాసుత కనిగొనెన్. 168

క. ఓతల్లి నీమనోహరు
నాతతసదయాంతరంగుఁ డై వసుధేశుం
డీతఱిఁ దోడుక రమ్మనె
నీతాపము మాను మింక నీరజనయనా. 169

వ. అనిన విని గ్రీష్మసమయోష్మదందహ్యమానమానస యైనమ
యూరిక ఘనాఘనగర్జానినాదంబు వినినచందంబున సుందరీ
మణి తద్వచనంబు విని కుతూహలాయత్తచిత్తయై కంఠ
హారం బొసంగిన గ్రహించుకొని బిల్హణున కి ట్లనియె. 170

ఉ. ఓకవిరాజశేఖర మహోన్నతి నీవు రచించుపద్యముం
దేఁకువతోడ నానరపతిం గని యిచ్చినఁజూచి యెంతయుం
గైకొని దానియర్థమును గాంక్షదలిర్ప గ్రహించి యప్పుడా
స్తోకజవంబుమీఱ నినుఁ దోడ్కొనిరమ్మనెనయ్యలియ్యెడన్.

వ. అని యత్యాదరంబున శుభలక్షణ ప్రశస్తంబగునతనిహస్తం
బుఁ బట్టుకొని వచ్చునెడ. 172

తే. రాజరాజగుమదనాభిరామునృపతి
తనకుమారిని దలఁచి యాస్థాన మెడలి
వచ్చి తద్ద్వారమం దున్నవనజపత్త్ర
నేత్ర దగ్గఱఁ జేరి కన్నీరు దుడిచి. 173

తే. శిరము మూర్కొని చికురముల్ సిక్కువాపి
చక్కఁగా నిడి గద్గదస్వరముతోడ
ననియె దయ మీఱ భూపాలుఁ డాత్మజాత
కమ్మ సంతాపమును మాను మమ్మ యనుచు. 174

క. ఓకూర్మితనయ కవివరు
నీకోరిక మీఱఁ గూర్తు నిశ్చలమతి వై
నాకడకును రావమ్మా
యీకడ నాచేయుపని గ్రహింపుము మదిలోన్. 175

రాజు కవివరు నెదురుగాఁ జని తోడ్కొనివచ్చుట.

వ. అని యుపలాలించి యంతఃపురంబున కనిచి బిల్హణునకు
నెదురుగాఁ జని నమస్కరణపూర్వకంబుగఁ గౌఁగిలించి చతు
రంతయానంబు నధివసింపంజేసి సభామంటపంబునకుం దో
డ్కొనివచ్చి యుచితాసనంబునం గూర్చుండ నియమించి
సభాసదులు విన నృపవరుం డతని కిట్లనియె. 176

ఉ. ఓచతురాననాన్వయమహోదధిపూర్ణశశాంక బిల్హణా
ఖ్యా చతురాస్య నీమహిమఁ గన్గొన నేరికి శక్యమౌ ధరన్
నీచతురోక్తివైఖరికి నీదృఢవృత్తికి నీకవిత్వధా
రాచలితైకనిష్ఠకు నహర్నిశమున్ మది నేను మెచ్చితిన్.

రాజు కవివరు నూఱడించి తనకూఁతుఁ బెండ్లి గ మ్మనుట.

చ. తడఁబడి యెవ్వఁడేనియుఁ గృతఘ్నునియందొనరించుమేలుకై
పడిని మదీయకృత్రిమము భవ్యగుణాకర నీమనంబునం
దడవక సుందరీమణివతంసము నాతనయన్ వరించి యే
ర్పడ నయమొప్పమత్పురికి భర్తవు గమ్మనిపల్కె వెండియున్.

క. రేపు సమస్తం బగుఁ గా
కిప్పొద్దున్ బడలినావు హితమతితో నీ
వీపట్ల సేదఁ దేఱుము
భూపాలనుతైకచర్య భూసురవర్యా. 179

వ. అని యొడంబఱిచి కవివరుని యథాస్థానంబున కనిచి వసం
తాఖ్యున కిట్లనియె. 180

క. ఓమంత్రివర్య చూచితె
భూమీసురుచిత్తవృత్తిఁ బోలింపంగా
నేమందు నెంతదృఢ మా
భామామణిహృదయ మట్లు పరిశీలింపన్. 181

క. ఈవిధమున నిర్వరకున్
దైవాజ్ఞన్ ఘటన మయ్యెఁ దప్పింపంగా
నావశమె యగ్రజన్ముఁడు
భావింపఁగఁ గూఁతు నిత్తు భవ్యవిచారా. 182

వ. అనిన విని మంత్రివరుండును సభాసదులును నేతత్కార్యంబు విశేషకార్యం బనిన విని వారలం బనిచి యంతఃపురంబుఁ బ్రవేశించి పరిచారికాజనంబులం బిలిపించి యి ట్లనియె. 183

క. ఓకాంతలార మత్సుత
కాకవివర్యునకు భోజనాదులు పూర్వం
బేకాలఁది విచారించితి
రాకాలఁదిం జేయుఁ డనుచు ననిచి రయమునన్. 184

వ. తనదార యగుమందారమాలిక కాచందం బంతయుం జెప్పి యాయమ కానందం బాపాదించి భోజనాదికృత్యంబులు దీర్చి సుఖం బుండు నంత. 185

## ప్రాతఃకాలాభివర్ణనము.

చ. తెలతెలవాఱెఁ దూర్పునలుదిక్కులవిచ్చెఁ దమంబుపక్షులుం
గలకలఁబల్కెఁ గోకములు గాంచెముదంబులుడువ్రజంబుఖ
స్థలమున నాడఁగాడకును జాఱెఁ జెలంగి పదాయుధంబు లు
గ్గళగతి మ్రోసె వీచె వలిగాడ్పులు భూజను లుల్లసిల్లఁగన్.

సీ. కోకాంగనాగణశోకమారుతసముత్థ
ఘనతరజ్వాలలఁ గందినాఁడొ?
విరహదుస్సహవధూవిపులనిశ్వాసనోష్ణ
గంధవాహములచేఁ గమలినాఁడొ?
బాధితపద్మినీపటలశుక్సంప్రాప్త
ఘోరపాపంబునఁ గుందినాఁడొ?
జనదూరితాప్రాప్తజారచోరవ్రాత
శాపంబులను గొంత సమసినాఁడొ?

తే. యనఁగ దోషాకరుండు కళానుభూతి
దొరయ వెన్నెలపులుఁగులఁ దొడరి యితఁడు
రేపు నేవేళ కొదవునో మాప నేమి
యనుచు వడి సారమంత కొల్లాడ నరిగె. 187

ఉ. వెన్నెలతీవలం దడఁగి వెల్వడి విస్ఫురసారసావళిం, గ్రన్నన
సౌరభంబు గొని రాజిలు గంధసమీరణంబు ల,భ్యున్నత
సౌధరాజములఁ బుష్పశరాసనకేళిఁ దేలియం, దున్నవధూ
శ్రమాంబుతతులొప్పులుమీఱ హరించునెంతయున్. 188

మ. ముదమొప్పారఁగఁ బద్మినీమణులు మోముల్విప్పఁ జక్రంబు ల
భ్యుదయం బొంద సదాళులుల్ సరసవిస్ఫూర్తిం బ్రవర్తిల్లనా
స్పదమై భాసిలుపుష్పదంతగజరాజం బెక్కి యుద్యద్ద్విజుల్
మదిరంజిల్లఁగసన్నుతింపఁ బొలసెన్ మందానిలుం డత్తఱిన్.

మ. మలయాహార్యతటంబు డిగ్గి విలసన్మల్లీమతల్లీలతా
వళులం జిక్కి ప్రయాసత న్వొదలి దివ్యచ్ఛాయకాసారని
ర్మలతోయంబుల నీఁది పంకరుహసౌరభ్యంబుఁ గొల్లాడి ప
క్షులనాదంబులతోఁ జరించు మరుదంకూరంబు లవ్వేళలన్.

క. తనతమ్ముల వైభవమును
గొనె నఁట యొకరాజు వానిఁ గొట్టెద ననుచున్
ఘనకోపుఁ డయ్యె ననఁగా
నినుఁ డతితేజం బెసంగ నేతెంచె నొగిన్. 191

మ. హరిచక్రంబుభరించియుద్భటనిశాటాటోపముల్ మాన్చియు
ద్ధురలీలాప్తి బుధాంకవర్తియయి యెంతోఁపూర్వదేశంబుభా
సురమైయొప్పఁగనిందునందునిలిపెన్ స్తోత్రార్హుఁడేయంచుశం
కరపద్మోద్భవులున్ భజింపఁ జెలఁగెం గల్యోదితాచారుఁడై.

ఉ. అంగుగఁ గాలమున్నరికి నావల నీవల వ్రేలుబంధురా
భంగురపాశము ల్వెలయు బంగరుపోఁతలఘుంటలో యనన్
సంగతి మీఱఁ బ్రాక్చరమశైలములం గనుపట్టి రర్కసా
రంగధరుల్ నిజోర్ధ్వగుచు లంపము నొందఁగ నట్టివేకువన్.

క. హితవిబుధస్థితి గోత్రా
హితకరుఁ డుదయించె గురుబుధేశహితుం డై
ధృతిఁ బూర్వదేశముం గొని
క్రతువులు గోతలమునందుఁ గడు నొప్పారన్. 194

సీ. అతులద్విజాలోకనావహుం డై త్రయీ
సుముఖుఁ డై నట్టితేజోమయుండు
కమలామనోహరాకారుఁ డై శర్వరీ
చరుల నొంచినచక్రధరణశాలి
యఖిలలోకతమోపహరణనైపుణవృత్తి
రాజిల్లు నట్టిసర్వజ్ఞవిభుఁడు
మిత్త్రుఁ డై భువనపవిత్త్రకుం డై తగ
ధర వెలింగించుసన్మార్గవర్తి

తే. యోగిమూర్తి యనంగఁ బద్మాప్తుఁ డనఁగ
నార్జితార్యుఁ డనంగ దివ్యైకవాక్స్త
వముల ద్విజరాజసంగతి వసుమతీంద్ర
శేఖరారూఢతను రవి చెలఁగె నెదుట. 195

తే. అలరుతమ్ముల నొకటి గానాత్మఁ దలఁచి
దిశలు చెలువొందఁ దమము భేదించి తనదు
లోకబాంధవవిఖ్యాతి లోకు లెన్నఁ
గరము వెలుఁగంగఁ బద్మినీకాంతుఁ డలరె. 196

క. ఉరుకువలయంబు బెగడఁగ
ఖరకరుఁడు జనించి రాఁగఁ గలుగుసదాళిన్
పరుసఁ గని రూపుమాపఁగ
నరిగెను ద్విజరాజు పశ్చిమాంబుధికడకున్. 197

చ. సమయకిరాటకుం డుదధిజాడల వచ్చుచుఁ జేరి పూర్వది
గ్రమణికి విక్రయించుటయు రాగపువన్నెపటంబు విచ్చిచూ
పె మదికి హర్షమైన నది బేరములాడినిబద్ధమైనని, ష్కము
నొక టిచ్చెనో యనఁగఁ జాయలుదోఁచనినుండుఁ జెల్వగున్.

తే. ఒక్కయినుఁ డంతకంతకు నుక్కు మిగుల
నొక్కరా జదిసూడంగ నోర్వలేక
డింది వెల్వెల నై యొక్కదిక్కు సేరె
ననఁగ సూర్యుండు హెచ్చె హిమాంశుఁ డడఁగె. 199

చ. సమయవినోది మిన్ననెడి చక్కనిరంగమునందు సర్వది,గ్రమ
ణులుచూడఁగా రడమురక్తినిఁ జూపవిధుండ నెండున,ద్దమునొ
కకర్ణమం దునిచి దాపలికర్ణమునందు హేమచక్రము వెడ
లంగఁ దీసె ననఁగా రవి దోఁచెఁ బ్రభాప్రభాస్ఫుఁ డై. 200

రాజు దనకూఁతును గవి కిచ్చి పెండ్లిసేయ సమకట్టుట.

వ. ఆసమయంబున నంతకుమున్న మంగళతూర్యనాదంబులు వినుచు మేల్కని మదనాభిరామభూమీధవుండు స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి సముచితాలంకారుండై సభాస్థలంబునకు వచ్చి మంత్రిపురోహితామాత్యబంధువిద్వజ్జనంబుల రావించి వారల నుచితాసనంబులం గూర్చుండ నియమించి సుప్రసన్నుండై యిట్లనియె. 201

క. ఘనులార బిల్హణాఖ్యున
కెనయఁగ మామకకుమారి నిచ్చెద నని నే
మనమునఁ దలఁచితి నిప్పుడు
ననుకూలము బ్రహ్మ పూర్వమందె ఘటించెన్. 202

వ. అని యిట్లు పలికి వారలయనుమతంబున ముహూర్తనిర్ణయం
బు సేయం దలంచి జ్యోతిశ్శాస్త్రకోవిదులఁ బిలిపించియడిగిన
వారలి ట్లనిరి. 203

క. గురుకవియుక్తి నినుండుర్
వరుస నమందాత్ముఁ డగుచు వసుధఁ బరఁగినం
బరికింపఁగ ద్విజరాజుకుఁ
జిరతరముగ మంగళాప్తి చెన్నగు వేడ్కన్. 204

తే. నీకుమారిక యళి యయ్యె నాకవీంద్రుఁ
డలర ధను వయ్యె నిర్వుర కనుగుణంబు
గ్రహవిరోధంబు నెందులఁ గానఁబడదు
రాజబల మొప్పు నొప్పుఁ దారాబలంబు. 205

క. ఈకన్య కిపుడు ద్విజరా
జాకట నాటింటఁ జెల్వ మలరినవాఁడై
చేకొని పదిటను మిత్త్రత
శ్రీకరముగ నొప్పు నతనుసిద్ధి నృపాలా. 206

వ. అని యిట్లు పలికిన సంతుష్టాంతరంగుండై నృపపుంగవుండు
నిజనగరం బలంకరింపం జేయుం డని పరిచారకులం బంచిన.

సీ. పచ్చలతోరణపంక్తులు ఘటియించి
కస్తూరిపూఁతలుగా నొనర్చి

మలయజపంకంబుఁ జిలికి జవ్వాదిరే
కలు దీర్చి రత్నవేదులు నమర్చి
ముత్యాలనవరంగముల రంగు గావించి
నవవజ్రమయవితానములు నెఱపి
వాసితాగరుధూపవాసనల్ నిగిడించి
సగడాల నెఱయుచప్పరము లునిచి
తే. ప్రతిగృహంబుల భద్రకుంభములు నిలిపి
దర్పణంబుల ద్వారబంధములఁ గూర్చి
ధవళసౌధాళిఁ జిత్రకేతనము లెత్తి
పురము శోభిల్లఁ జేసి రబ్బురము గాఁగ. 208

సీ. ఏవీథిఁ జూచిన నింపుమై మంగళ
తూర్యనాదములు సంతోష మెసఁగ
నేచాయఁ గాంచిన హితముగాఁ జెవులకు
వీణారవంబులు వేడ్క సేయ
నేపట్టుగనిన ఘరిపటహాదికా
హాళమృదంగైకవాద్యములు వెలయ
నేచోటు వీక్షింప వాచాచమత్కృతిఁ
బాటలు మాటలుఁ బరిఢవిల్ల
తే. నొప్పె నక్షత్రవల్లభాభ్యుదయమునకుఁ
జెలఁగి మిన్నంది యుబ్బినజలధికరణిఁ
దనరుఁ గవిరాజశుభమహోత్సవమునకును
నగరరాజంబు సంతతానంద మొంది. 209

క. అత్తఱి నయిదువ లారతు
లెత్తుచు ధవళములు వాడ నింపు దలిర్పం
గొత్తదనిపింపఁ బెండిలి
చిత్తరుచవిక కరుదెంచె క్షితిసుగుణ డెలసిన్. 210

సీ. ఈధామనిధికరం బెనయంగ నలుఁ గెడ
నేర్తువు పద్మిని నీవు రావె
యీకళానిధిఁ జేరి యెలమి సేవలు సేయ
నేర్తువు మృదుహస్త నీవు రావె
యీచతురాస్యతో నింపుమైఁ బలుకంగ
నేర్తువు శుభవాణి నీవు రావె
యీమహాసర్వజ్ఞు కిర వొంద శిర సంట
నేర్తువు శశిరేఖ నీవు రావె
తే. యనుచుఁ దమలోన భూమిపాలానుమతిని
సరససల్లాపవచనరచనలఁ దెలుపు
నంగనారత్నములు గొంద ఱాసువర్ణ
గాత్రుఁ గదియుచు మంగళారాత్రిక లిడి. 211

క. మంగళము రాజనుతునకు
మంగళ మంబుజముఖీరమాతనయునకున్
మంగళము శాస్త్రవేదికి
మంగళముకవీంద్రమౌళిమణికి సుగుణికిన్. 212

వ. అనుచు నారతిపాటలు పాడి శిరంబున నక్షత లునిచి. 213

చ. నడుమసియాడఁజన్నుఁగవనాట్యముసల్పఁగ రత్నహారముల్
దడఁబడి డోలికాకలనఁ దార్కొన వేణి చలింపనెమ్మొగం

బోడలును జెక్కుటద్దములు నొయ్యఁజెమర్పఁగఁగంకణంబులే
ర్పడి రవ ముప్పతిల్ల నొకభామ తలంటుఁ గవీంద్రమౌళికిన్.
తే. గందపటకలిఁ దలఁ బుల్మి మంద మైన
బంగరుకటాహములలోనఁ బొంగుజలముఁ
బోల్లు గావించి బిందియ ల్పట్టి యొక్క-
యతివ సుకవికి మజ్జనం బార్చె నపుడు. 215
సీ. తడి యార్చి వలువ లేర్పఁగ నిచ్చె నొకలేమ
యుదుటుపావా లుంచె నొక్కభామ
పువ్వులు సిగఁ జుట్టెఁ బోలు గాంధ నొకకొమ్మ
మురువులు నిడె నొక్కముద్దుగుమ్మ
కస్తూరితిలకంబు ఘటియించె నొకజాణ
యొసల గంధ మలందె నొక్కచాన
చొకట్లపోగులు సవరించె నొకబాల
యురుహారములఁ బూన్చె నొక్కగోల
తే. పడఁతి రత్నపుటుంగరాల్ దొడిగె నొకతె
వెలఁది కపురంపుసుడిఁబెచే విసరె నొకతె
నిలువుటద్దంబు ముందర నిలిపె నొక్క-
మగువ బిల్హణకవిశిఖామణికి నపుడు. 216
క. ఈరీతిఁ గవిని చెలు లిం
పారఁగఁ గయిసేసి నృపవరాత్మజ కెంతో
నీరాట మొనర్చియు శృం
గారించిరి వేడ్కఁ బొడమ గ్రక్కున నంతన్. 217
క. సరిగంచుచీర కటిపై
నెఱయంగాఁ గట్టి రైక నీటై మెఱయన్

సరిగుబ్బలు గుబ్బతిలం
గరముగ సవరించి పైఁట గావించి రాగిన్. 218

క. ఇఁకఁ జిక్కువాసెనే యని
చికురంబులు చిక్కుదీర్చి చెలువుగఁ గీల్గం
టొకయింతి వెట్టి నవ్వుచు
సకి ముడి బాగుగఁ బడె ననుచు సన్నుతి నేసెన్. 219

తే. సూర్యచంద్రులు మైత్రిచే **సు**దతివదన
వనజ మంతయు సంతతవైభవంబు
నందఁ జేయ వసించిరో యనఁగ నపుడు
సూర్యచంద్రుల నిడె నొక్కశోభనాంగి. 220

ఉ. కోరిక నాఁకలిం గొని చకోరికలున్ జవ ముప్పతిల్లఁగా
సారసవైరి యం చమృతసారము నూటుచుఁ దోనె తద్గతం
బైరహిమించు నల్పుగొన నత్తఱి జాఱె నవంగ నొక్క సిం
గారపుబొమ్మ కాలుఁ దెలిగన్నులఁ గాటుక దీర్చి బోటికిన్.

తే. తారకావళిసేవ్యమై తనరునట్టి
చంద్రబింబంబుతోడుత సాటి సేయఁ
జెలువమోమునఁ గస్తూరితిలక మునిచి
ముత్తెములచేరు లమరించె ముదిత యొకతె. 222

క. అద్దములవంటిచెక్కుల
నిద్దపురుచు లుప్పతిల్ల నీటుగ శ్రుతులన్
ముద్దులగుమ్మకు నొక్కతె
ముద్దియ కుండలము లునిచె ముద్దులు గాఱన్. 223

క. సంగతిగ మోవిచవిఁ జూ
డం గవి యనువెంచె ననఁగ దార్కొనునాసన్

పసుపు హేమక్షణాస్త్రములు సుమనోహారములై
గళసుగంధవిశేషకలనఁ బొదలఁ
సమణాంగిచూపు లత్తఱి శిలీముఖములై
హృదయపంకజ మావహించి నాఁట
ఘనసులోచనప్రభలు వరాళులై
తనరారుపాదపద్మముల ప్రాలఁ
తే. బరఁగె కవిరాజు సార్వవైఖరిని మోహ
కలితవిభ్రమవిస్మయాక్రాంతుఁ డగుచు
వనితరాయుత్తచిత్తుఁడై యాత్మలోనఁ
జెలువభావంబు గాంచి వీక్షింపుచుండె. 230
సీ. ఈసర్వమంగళాభూషణకాంతులు
భరితసుధాకరప్రభలు గాఁగ
నీశ్యామకస్తోయి నింపారుకీర్తులు
ప్రాసినరతికాంతుభాతి గాఁగ
సంతతికస్తురిల భాసిలుదీప్తుల్
పాలుపొందఁ దమ్ములపూజ గాఁగ
నీయార్యలోచనచ్ఛాయలు మాళిసైఁ
బ్రవహించుగంగాఝరంబుఁ గాఁగఁ
తే. బరఁగు కవిరాజమౌళి సర్వజ్ఞమూర్తి
విలసదసమాంబకస్ఫూర్తి విశదకీర్తి
యంచితాచలభోగభాగ్యైకవర్తి
యనుచు నచ్చటివిబుధాళి యభినుతింప. 231
సీ. భావిఫలోదయప్రాప్తభాసురములై
పరఁగుమూర్తికములబారు లనఁగ

రతిపంచశరులు సంతతకేళిఁ దేలుచుఁ
బనివడి యాడుపూబంతు లనఁగఁ
దియ్యవిల్తుఁడు రెండుతెఱఁగు లై యిరువుర
కడ లందివేయుమార్గణము లనఁగఁ
దనవలనను వీరు దనరారి రనుచుఁ జం
ద్రుఁడు సల్లు నమృతబిందువు లనంగఁ

తే. జెలఁగునయ్యామినీపూర్ణతిలక బిల్హ
ణాఖ్యకవివర్యుచూపు లన్యోన్యమైత్రి
నోలయుచు గతాగతంబు లై కలయ నడరి
వెలయఁ జూచిన జనులకు వేడు కయ్యె. 232

తే. లలితముగ విప్రులు 'తదేవ లగ్న' మనుచు
మంత్రములు వాడ శుభపీఠ మహితలీల
వరుస నుంచిరి యవ్వధూవరుల నృపతి
యనుమతంబున నైదువ లపుడు వేడ్క. 233

తే. పుడమివేల్పులు పుణ్యాహపూర్వకముగ
దేవతాహ్వాన మొనరించి తివిరి వారి
కరములను గంకణములు వేడ్కను ఘటించి
చదివి రెంతయు మంగళాష్టకము లపుడు. 234

మ. పొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్యనిచ్చు పగిదిన్ క్ష్మానాథముఖ్యంబుగాఁ
బొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్యనిచ్చె సుమనస్సంతానముల్ మెచ్చఁ
[గన్. 235

క. దలఁబ్రాలపళ్లెరంబులు
వెలఁదులు పార్శ్వములఁ బూన విభునిశిరమునన్
జలజాక్షి ముంచి దోయిటఁ
దలఁబ్రాలను బోసె విభుఁడుఁ దనపై నుంచన్. 236

వ. ఇట్లనన్యాతిశయంబునఁ దదుత్సవంబు గావించి విధ్యుక్త
ప్రకారంబుగఁ బ్రధానహోమంబు లాదిగాఁ గలవి యాచ
రించి బంధుసహితంబుగా భోజనాదికృత్యంబులు నెఱపి తద
నంతరంబున శేషహోమాదికృత్యంబులను నిర్వర్తించి భూ
సురులకు మ్రొక్కి తదాశీర్వచనంబులు గైకొని బిల్హణుం
డును యామినీపూర్ణతిలకయును యథేష్టభోగంబు లనుభ
వించునెడ. 237

సీ. నీలమేఘంబులు శైలాగ్రముల వ్రాలెఁ
బరికింప వెల్వెలఁ బాఱె విధుఁడు
సన్నగించెను బికస్వరము లంతంతకుఁ
గలహంసగతుల సంగతులు దప్పె
గగనమార్గము సావకాశమై బలు పొందె
నహిరాజురూపై యందంద నిలిచెఁ
గేతకిదళములు గెలఁకుల భాసిల్లె
మెఱుపుఁదీఁగలు మింటఁ దఱచు మెఱసె

తే. నంద మొప్పఁగఁ గొలఁకుల నంబువాహమొ
నాడకాడకుఁ గోరిక లతిశయిల్లె
ననుచు జను లెల్లఁ బొగడ ఘనాగమమున
గర్భగౌరవ మాకాంత గాంచె నంత. 238

వ. ఇట్లు నవమాసంబులు నిండి దశమం బగు మాసంబునం దొ
క్క సుముహూర్తంబున. 239

మ. పరువం బూనఁగ సంచరింప గ్రహముల్ మార్తాండసంయు
క్తిచే, నెఱయన్ దిక్కులు దెల్విఁ గాంద గరిమ స్నిగ్ధవ్యస్త్రపం
గాదివా, స్వరసంబుల్ సెలఁగన్ సురప్రతతి యుద్యత్పుష్ప
వర్షంబు ల,త్తఱి వర్షింప వధూటి గాంచెను సుతుఁ ద్రైలోక్య
భాగ్యోన్నతున్. 240

క. ఘనతం బ్రభాకరోదయ
మున జనియించుటయు విప్రముఖ్యులు పేర్కొం
గని లగ్నగతిఁ బ్రభాకరుఁ
డనునామం బిడిరి బిల్హణాఖ్యుఁడు వెచ్చన్. 241

వ. అప్పుడు మదనాభిరామభూమీధవుఁడు విద్వజ్జన బంధు
మిత్ర పురోహితామాత్యసమేతంబున నతనిం దనవంశకర్త
గాఁ బరిగ్రహించి జాతకర్మాదులు సలిపి గోభూతిలహిరణ్యా
దిషోడశదానంబులు సేసి భూసురాశీర్వచనంబు లంది. 242

క. ఘనుఁడు ప్రభాకరుఁ డంతన్
దినదినమును వృద్ధిఁ బొంది దివ్యద్యుతుఁ డై
కనుపట్ట వానిఁ బట్టము
చన వొప్పఁగఁ గట్టి సుఖము జయముం గాంచెన్. 243

మాలిని. ప్రథితగుణకలాపా భంజితేశానచాపా
ప్రథనవిజయకోపా భానుకోటిప్రతాపా

మథితదనుజదీపా మన్మథాచ్ఛాద్యరూపా
మధురతరకలాపా మాన్యరాజావనీపా. 244

గద్యము. ఇది శ్రీసీతారామచరణసేవాప్రభావసంపాదితకవితా
విచిత్ర కాశ్యపసగోత్రపవిత్ర శ్రీమత్పింగళి సూర్య కృష్ణస్వామి
ప్రణీతం బయినబిల్హణీయోపాఖ్యానం బనుమహాప్రబంధంబు
నందు సర్వంబును తృతీయాశ్వాసము.

బిల్హణీయము సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1926.

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి | ... | I | 4 |
| అడవిమల్లెలు | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము | ... | 0 | 8 |
| అప్పకవీయము, విపులమైన విమర్శతో చక్కఁగముద్రితము | | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, సటీక | ... | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, చక్కనిప్రతి | ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి 2 సంపుటములు | ... | 8 | 0 |
| ఆంధ్రభారతము, 7 సంపుటములప్రతి | ... | 15 | 12 |
| డిటో 3 సంపుటములప్రతి | ... | I5 | 0 |
| ఆది, సభాపర్వములు గల సంపుటము | ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ,, | ... | 2 | 4 |
| శాంతిపర్వము ,, | ... | 2 | 4 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 2 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము | ... | 0 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆదిపర్వము, పెద్దచ్చు, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 0 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మ కృతము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 14 | 0 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| ఆంధ్రనామసంగ్రహము, నిఘంటుత్రయము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము | ... | 2 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము | ... | 1 | 8 |
| కళాపూర్ణోదయము | ... | 2 | 4 |
| కాశీఖండము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభువుకృతము | ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక కాలికోబైండు | ... | 0 | 10 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు | ... | 7 | 8 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము, మేలుప్రతి | ... | 1 | 10 |
| చెన్నబసవపురాణము | ... | 1 | 2 |
| జైమినిభారతము | ... | 1 | 0 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 2 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము | ... | 2 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 1 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| నరసభూపాలీయము. అట్టబైండు | ... | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 0 | 12 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 6 |
| నీతిపద్యసంగ్రహము. సటిప్పణము | ... | 0 | 4 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 4 |
| నృసింహపురాణము | ... | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 0 | 12 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము కేతనకవికృతము | ... | 1 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 0 |
| బ్రహ్మోత్తరఖండము | ... | 1 | 0 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భాస్కరరామాయణము | ... | 4 | 0 |
| భోగినీదండకము | ... | 0 | 1 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 1 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామి శాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రితము | ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| మొల్లరామాయణము, చిన్నసైజు | ... | 0 | 10 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 12 |
| రంగనాథరామాయణము, ద్విపద | ... | 3 | 8 |
| రంగరాయచరిత్రము | ... | 0 | 8 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 2 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| రాజశేఖరవిలాసము ... | 0 | 8 |
| రామరాజీయము, చక్కనిప్రతి ... | 0 | 12 |
| రామాభ్యుదయము ... | 1 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి ... | 0 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 10 |
| రూపలి, రాజపుత్రస్త్రీ సాహసపుస్తకం, శ్రీ ఎనమండ్ర నారాయణమూర్తిగారిది ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక ... | 1 | 4 |
| వసుచరిత్రవిమర్శనము ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము ... | 4 | 0 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిది ... | 1 | 4 |
| వేంకటాచలమాహాత్మ్యము ... | 1 | 0 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు ... | 0 | 6 |
| ,, బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో ... | 1 | 4 |
| వేమనపద్యములు (2700) చిన్నసైజు ... | 1 | 12 |
| ,, (2700) ఆంధ్రతాత్పర్యముతో ... | 3 | 8 |
| విజయవిలాసము ... | 0 | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది ... | 0 | 5 |
| వైశ్యపురాణము ... | 1 | 4 |
| వీరభద్రవిజయము ... | 0 | 12 |
| వైజయంతీవిలాసము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 12 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము ... | 0 | 12 |
| శివలీలావిలాసము ... | 0 | 6 |
| శ్రీనాథునివీథినాటకము ... | 0 | 2 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| శృంగారనైషధము, శ్రీనాథకవిది | ... | 1 | 0 |
| శృంగారశాకుంతలము, పినవీరభద్రకవిది | ... | 0 | 12 |
| సహస్రకంఠరామాయణము | ... | 0 | 14 |
| సప్తమస్కంధము, ప్రహ్లాదచరిత్ర | ... | 0 | 6 |
| ,, సటీక, చిన్నసైజు, కాలికోబైండు | ... | 1 | 8 |
| సారంగధరచరిత్ర | ... | 0 | 10 |
| సానందోపాఖ్యానము | ... | 1 | 0 |
| సీతారామాంజనేయసంవాదము | ... | 2 | 8 |
| డిటో మేలుకాకితములు సటీక | ... | 3 | 8 |
| సులక్షణసారము, సటీక | ... | 0 | 10 |
| హారవిలాసము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | ... | 0 | 12 |
| హంసవింశతి, నారాయణామాత్యకృతము | ... | 0 | 14 |

## శతకములు.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రనాయకశతకము | ... | 0 | 4 |
| మాతృశతకము, సటీక | ... | 0 | 1 |
| కుమారీశతకము | ... | 0 | 3 |
| సుమతిశతకము, సటీక | ... | 0 | 3 |
| దాశరథిశతకము ,, | ... | 0 | 4 |
| మానసబోధశతకము ,, | ... | 0 | 3 |
| భాస్కరశతకము ,, | ... | 0 | 4 |
| కలువాయిశతకము ,, | ... | 0 | 4 |
| కవిచౌడప్పశతకము ,, | ... | 0 | 2 |
| నృసింహశతకము | ... | 0 | 4 |
| చంద్రశేఖరశతకము | ... | 0 | 2 |
| దేవకీనందనశతకము | ... | 0 | 2 |
| సర్వేశ్వరశతకము | ... | 0 | 2 |
| సంపగిమన్నశతకము | ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| వేణుగోపాలశతకము | ... | 0 | 4 |
| వృషాధిపశతకము | ... | 0 | 5 |
| నారాయణశతకము | ... | 0 | 2 |
| సింహాద్రినారసింహశతకము | ... | 0 | 3 |
| జగన్నాయకశతకము | ... | 0 | 2 |
| ప్రసన్నరాఘవశతకము | ... | 0 | 3 |
| రామరాఘవశతకము | ... | 0 | 2 |
| రామరామశతకము | ... | 0 | 2 |
| రామతారకశతకము | ... | 0 | 4 |
| రామప్రభుశతకము | ... | 0 | 2 |
| రామలింగేశశతకము | ... | 0 | 3 |
| భద్రాద్రిరామశతకము | ... | 0 | 2 |
| ఉన్నవరాజగోపాలశతకము | ... | 0 | 3 |
| శివముకుందశతకము | ... | 0 | 2 |
| సదానందయోగిశతకము | ... | 0 | 2 |
| ఒంటిమిట్ట రఘువీరశతకము | ... | 0 | 2 |
| కాళహస్తీశ్వరశతకము | ... | 0 | 2 |
| కాళహస్తిశతకము, 'సాంబశివామహాప్రభో' | ... | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము | ... | 0 | 3 |
| చిత్తబోధశతకము, తాత్పర్యసహితము | ... | 0 | 3 |

## నాటకములు.

| | | | |
|---|---|---|---|
| శూరబొబ్బిలినాటకము | ... | 0 | 12 |
| కమలాపహరణనాటకము | ... | 1 | 4 |
| రామవనవాసనాటకము | ... | 0 | 12 |
| విచిత్రపాదుకాపట్టాభిషేకము | ... | 0 | 12 |
| పాండవాజ్ఞాతవాసనాటకము | ... | 0 | 12 |
| చినరంగారాయనాటకము | ... | 0 | 6 |
| కృష్ణాకుమారినాటకము | ... | 0 | 10 |

## వచనగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు 3 సంపుటములు | | 7 | 0 |
| డిటో ఒకటేసకపుటము | ... | 6 | 8 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | ... | 0 | 14 |
| మదనమోహనమాళవ్యగారి జీవితము | ... | 0 | 8 |
| పంజాబుఅల్లరి, చిత్రపటములతో | ... | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| శ్రీవివేకానందవిజయము | ... | 1 | 12 |
| ప్రాచీనదేశచరిత్రలు | ... | 1 | 12 |
| భారత రమణీమణులు, ప్రథమభాగము | ... | 0 | 12 |
| ,, రెండవభాగము | ... | 0 | 8 |
| వీరాంగనలు | ... | 0 | 8 |
| పతివ్రతలకథలు | ... | 1 | 8 |
| శ్రీమహాభక్తవిజయము, ప్రతిమలతో | ... | 4 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 8 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 8 |
| హితోపదేశము, సులభశైలి | ... | 0 | 12 |
| సంగ్రహరామాయణము | ... | 0 | 10 |
| సంగ్రహభారతము | ... | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 4 |
| సంస్కృతనాటకకథలు | ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, సంజీవరాయశాస్త్రి | ... | 1 | 8 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | ... | 0 | 14 |
| దక్కనుపూర్వకథలు | ... | 1 | 8 |
| భోజులికథలు | ... | 0 | 8 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 8 |
| బేతాళునికథలు | ... | 0 | 8 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | [illegible] |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| వైద్యులకథలు | ... | 0 | 4 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 6 |
| శ్రీగైక్వారుగారి ఉపన్యాసములు | ... | 0 | 2 |
| సూరతుకాంగ్రెస్సు ఉపన్యాసములు | ... | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము | ... | 0 | 2 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | ... | 0 | 2 |
| శాలివాహనచరిత్ర | ... | 0 | 3 |
| శ్రీలాలాలజపతిరాయిజీవితము | ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్రము | ... | 0 | 3 |
| బాలగంగాధరతిలకు చరిత్రము | ... | 0 | 4 |
| శ్రీగోపాలకృష్ణగోక్లేజీవితము | ... | 0 | 2 |
| శ్రీమహాదేవగోవిందరానడేజీవితము | ... | 0 | 2 |
| శివాజీచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 8 |
| బుద్ధచరిత్రము ,, | ... | 0 | 4 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 3 |
| శ్రీవేమనయోగిజీవితము ,, | ... | 0 | 2 |
| దాదాభాయినౌరోజీచరిత్ర ,, | ... | 0 | 2 |
| గౌరాంగస్వామిచైతన్యజీవితము ,, | ... | 0 | 4 |
| శ్రీకరంచంద్ గాంధిజీవితము ,, | ... | 0 | 4 |
| నెపోలియన్ చక్రవర్తి చరిత్రము | ... | 0 | 4 |
| సోదరినివేదిత జీవితము ,, | ... | 0 | 2 |
| శ్రీగైక్వారుగారిజీవితము ,, | ... | 0 | 2 |
| వివేకానందస్వామిజీవితము ,, | ... | 0 | 2 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ,, | ... | 0 | 3 |
| అనిబిసెంటుచరిత్ర ,, | ... | 0 | 4 |
| లార్డుక్లైవుజీవితము ,, | ... | 0 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీ చిత్తరంజనదాసుజీవితము ,, | ... | 0 | 4 |
| ఆలీసోదరులజీవితము ,, | ... | 0 | 4 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| పండిత మదనమోహనమాళవ్యా జీవితము | ... | 0 | 2 |
| శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | ... | 3 | 8 |
| అనంతసాగరంబుక్కరాయసముద్రచరిత్ర | ... | [illegible] | [illegible] |
| రామదాసుచరిత్ర, ప్రతిమతో | ... | 0 | [illegible] |
| ఈసబునీతికథలు 1-వ భాగము | ... | 0 | 6 |
| డిటో 2-వ భాగము | ... | 0 | 8 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 1 | 4 |
| రేచుక్కపగటిచుక్కకథలు | ... | 0 | 3 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 2 |
| షేక్స్పియర్ నాటకకథలు | ... | 1 | 8 |
| శుకసప్తతికథలు | ... | 0 | 6 |
| పరిహాసవినోదకథలు | ... | 0 | 12 |
| సీతారామము | ... | 1 | 4 |
| ఐవన్హో, నవల, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| మదాలస ,, | ... | 0 | 10 |
| సుజనరంజని ,, | ... | 0 | 8 |
| రోషినార, చరిత్రవిషయకమగు నవల | ... | 0 | 12 |
| విజ్జలదేవి, నవల | ... | 1 | 4 |
| ఉన్మాదిని ,, | ... | 0 | 4 |
| రాధారాణి ,, | ... | 0 | 4 |
| అస్తమయము, నవల | ... | 1 | 8 |
| సత్యసేనవిజయము | ... | 0 | 4 |
| దుర్గేశనందని, నవల | ... | 0 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.